## మీ ముందు నిలిచే పాత్రలు

కరుణాకరం – [న్యాయవాది] వయస్సు 45 సం.

మధు - (న్యాయవాది కొడుకు) " 20

మదన్ - (కసితో చెరుణితిని వెలుగును చూసినవాడు) " 16

సత్యం – (విప్లవజ్వాలగా రగిలి చీకటిగా మిగిలినవాడు) " 25

రమణ – (మహానటుడు కావాలని ఊహల్లో తిరిగినవాడు) " 25

మహర్షి – (అభ్యుదయ భావాలు ఇతని ఆభరణాలు) " 20

రత్నాలు - (న్యాయవాది ఇంట్లో దీపం) " 25

డాక్టర్ - (సత్యం తెలిసినవాడు) " 40

గీత - (సత్యానికి చెల్లెలు కావటంతో అభాగిని అయింది) " 18

శ్రీ నవజ్యోతి నాట్యకళామండలి, వంగిపురం కోనూరు

నటవర్గం :

కరుణాకరం - శ్రీ వై. పుష్పరాజ్

మధు - శ్రీ బర్మా ప్రసాద్

మదన్ - శ్రీ పి భాస్కరరావు [టీచర్]

సత్యం - శ్రీ సిహెచ్. క్రిజన్ సన్

రమణ - శ్రీ సిహెచ్. మాణిక్యరావు

మహర్షి - శ్రీ సిహెచ్. నాగేశ్వరరావు [బి కాం]

రత్నాలు - శ్రీ యం. ఏసురత్నం

డాక్టర్ - శ్రీ యం ఎల్లమంద

గీత - కుమారి జి. విజయ (తెనాలి)

సాంకేతిక నిపుణులు -

దర్శకత్వం - శ్రీ సిహెచ్ క్రిజన్ సన్

నిర్వహణ - శ్రీ సిహెచ్ మాణిక్యరావు

ఆర్గనైజర్ - శ్రీ సిహెచ్ ప్రేమయ్య

పర్యవేక్షణ - శ్రీ పి భాస్కరరావు

మ్యూజిక్ - శ్రీ సైదారావు అండ్ కృష్ణ పార్టీ (పొన్నూరు)

సెట్టింగ్స్ అండ్ మేకప్ - శ్రీ కె కె రావు (గుంటూరు)

# శీలానికి శిక్ష

## మొదటి రంగం

[అది పెంకుటిల్లు, ముందుహాల్లో గోడలకు దేశనాయకులఫోటోలు, విశ్వకవుల కాలెండర్లు, ప్రకృతిచిత్రాలు తగిలించారు. రెండు కుర్చీలు, ఒక డ్రాయరు, పాతటీపాయ్ ఆ ఇంటి అలంకరణలు. తెర తొలగేసరికి గీతా, మధూలు పీటలు అమించుకుని మౌనంగా కూర్చునివున్నారు. మౌనం పెదాలపై చిరునవ్వులా విరిసింది. ఆ చిరునవ్వులు దిక్కులు పిక్కటిల్లేలా చేశాయి. కళ్ళలో మెరిసే ఆనందాన్ని, పెదవులపై పూరే కోరికల్ని తృప్తిగా తుడుచు కున్నారు గతంనుంచి తేరుకుంటూ]

మధు : మాట్లాడు.

గీత : నిన్నుచూస్తుంటే మాటలే రావటంలేదు.

మధు: మూగదానివై పోతావ్ సుమా!

గీత : (కిలుక్కున నవ్వి అతని బుగ్గమీద వ్రేలితో పొడిచింది. అతమా నవ్వాడు ఇద్దరూ కలిసి ఆనందంగా పాడుకున్నారు)

మధు: నాకో బహుమానం ఇస్తావా?

గీత : మనసే ఇచ్చాముగా.

మధు: అంతకన్నా మధురమయింది కావాలి.

గీత : నువ్వడిగితే ఏది కాదనాన్లెను?

మధు, అయితే ఇంకేం? ఒక తీయనిముద్దు పారేయి మరి - (అ ప్రయత్నం చేశాడు)

గీత : ఆగండాగండి- ఇంత ఆత్రం మంచిదికాదు.

మధు: అందాలుపూరించడం - అందకుండా పారిపోవడం- మీ ఆడవాళ్ళకు అలవాటేలే.

గీత : అందిన అందాలను వాడినమందారాలుగా చేయడం మీ మగవాళ్ళకు మాత్రం అలవాటు కాదా ఏమిటి?

మధు: పూలు విరియగనే సరికాదుగీతా! వాటిపరిమళం బయటపడాలంటే జడలోనో- ముడిలోనో చేరాలి.

గీత : పాపం—ఎంతాశ (సిగ్గుతో తలొంచింది)

మధు: ఆశ మానవుడిసొత్తు గీతా! హక్కు-కూడా.

గీత : ఇంకా నయం. ఆస్థి అనలేదు.

మధు: అవునుగీతా: ఆస్థికూడా అందుకే మనిషి ఆశను నమ్ముకుంటాడే గాని హృదయాన్ని అమ్ముకోడు గీతా, పరువానికి నరసరాన్కి వగ్గుంకావాలి, పూహలకూ, పూపిరికీ పూరటకావాలి, అందుకే... అందుకే.... నన్ను నీలోకి చేర్చుకోగీతా!

గీత : మధూ! (ఆనందంతో నోరు నొక్కి-సింది)

మధు: నిజంగీతా! జీవితంలో సుఖానికి నన్నొక్కణ్నే వారసుణ్నిచేశావు! కమ్మని కౌగలింతల పులకింతలలో నన్ను నేను మరచిపోయేంత మధురమయిన మత్తు కలిగించావు.

గీత : లేదు మధూ: మత్తయిన కోరికల్ని, మెత్తనిఆశల్ని నువ్వే కలిగించావు.

మధు: అవును గీతా! ఏ దూరతీరాలలోనో అనురాగం పెంచుకుందామని,
ఆనందం పంచుకుందామని. తీయనికలలు గన్నాం. మనకలలన్నీ
తీపి గురుతులుగా తొలకరి మెరుపులుగా మిగిలిపోగూడదని ఏ
దేవుణ్నయినా కోరుకుందాం గీతా!

గీత : మధూ! (తన్మయత్వంతో సతమతం చేసింది)

మధు: చదువుల పంచయం హృదయాలను కలిపింది. కళలూ కవితలూ
మన స్నేహానికి ఊపిరిపోశాయి గీతా! ఈ చదువూ సంస్కృతి
ఇలాగే వుండాలనీ ఈ బంధం జన్మజన్మల అనుబంధం కావాలనీ
వేడుకుంటున్నాను. మరి నువ్వేమంటావు?

గీత : తిరిగి జన్మంటూ వుంటే నీనీడనే ఇంకచోటు ప్రసాదించమని
దేవుణ్ని వేడుకుంటాను మధూ.

మధు: మరి నేనడిగింది? (ముద్దు కావాలని సైగ చేశాడు)

గీత : ముందు నాకో మాటివ్వాలి?

మధు: వెంటనే ఆ మూడుముళ్ళు వేసి...

గీత : పనోళ్ళతల్లిని చేస్తావు... అంతేగా?

మధు : అంతకన్నా ఆడదానికి కావలసింది మాత్రం ఏముంది గీతా?
"అమ్మా" అనిపించుకునే అపురూపవరం భగవంతుడు మీకు ప్రత్యే
కంగా ప్రసాదించాడు.

గీత : మీ మగవాళ్ళు యెప్పుడూ ఇంతేలే ఆడవాళ్ళను ముసలివాళ్ళను
చేయాలనే చూస్తారు

మధు: అదేమిటి గీతా! పిల్లల్ని కనడం — వాళ్ళచిరునవ్వుల దివ్వెలు వెలి
గించడం ఇష్టంలేదా నీకు?

గీత : పిచ్చిమధూ! కలలుగంటే, కరగిపోతాయి చెరిగిపోతాయి కూడా

మధు: చూడు గీతా! బ్రతుకుచుట్టూ నీవలపుతీగలే అల్లుకుపోయాయి. గుండెల
నిండా కన్నులనిండా నీ మమతలమల్లెలే విరిశాయి. నీ అడుగులో
అడుగువేసి, ఎదలో యెదను కలిపి, నవ్వులో నవ్వుగా చూపులో

నగు నన్నే ధిక్కరించి - ఎవరినో నమ్మి హృదయాన్ని అమ్మి దారితప్పిన నిన్ను క్షమించనే క్షమించను సుందరీ!

గీత : చూడు బావా,

రఘు : బావ ... ఎంత మధురము ఎంత మార్దవము ఎంత మాధుర్యము, సుందరీ, ఏదీ, మరొక్కసారి. మమ్మలను "బావా" అనితీయగా పిలూ.

గీత : బావా.

రఘు : ఆహా. జన్మ తరించినది సుందరీ అమృతము సేవించినంత తీయగావుంది మరొక్కసారి...

గీత : బావా.

రఘు : ఆహా, ఇంకొక్కసారి.

గీత : బావా.

రఘు : ఆ, బావా అని బాంధవ్యము కలిపినంత మాత్రమున చేసిన అపరాధము అదృశ్యమగునని యా నీ అభిప్రాయము లేదుసుందరీ లేదు. అవక్ర పరాక్రమశాలి - అఖండ - ప్రచండ - ప్రతాప - ప్రభావోపేతుడు - నవరత్న ఖచిత సింహాసనాధికారము - హస్తగతము చేసుకుని - ఆంతరంగిక భటులతో - అంతఃపుర కాంతలతో - రేయి పగళ్ళు మరిచి - పాపపుణ్యాలు విడిచి - రక్తరాజ విరుదాంకితుడు కావాలని - పూరట చెందుచున్న నన్ను కించపరిచి - వంచించిన నేరానికి - నిన్ను కఠినముగా శిక్షించకుండిన - ఉనికేమెందులకు? మా రాజరికమెందులకు? మా కౌరవ వంశ గౌరవ ప్రతిష్ఠలెందులకు?

గీత : అబ్బబ్బ ఏమిటిబావా నీ గోల?

రఘు : అవమానము. సహించరాని అవమానము. ఎవరక్కడ? ఈ పిత రాలిని, బంధించండి.

గీత : నేనుచేసిన అపరాధమేమిటో శెలవిస్తారా మహారాజా?

రఘు : పంచభర్తృకయైన - ద్రౌపది వలువలు నిండుకొలువులో ఒలిపించిన ద్యూత క్రీడా ప్రవీణ్యులైన - దుర్యోధన చక్రవర్తి కుమారుడు

తనే - మోసముచేయ సాహసించిన నిన్ను నిలువునా పాతెయ్య కుండిన - మహారాజులమైన మాకు సిగ్గుచేటు - అయినా, మాకు కోపమొచ్చినా - తాపమొచ్చినా - అపజాలమనీ - నీకు ముమ్మటి సరసక్రీడా సమయమ్మున - విన్నవించలేదా సుందరీ.

గీత ; నేను చెప్పేది వింటావా? లేక, ఇలాగే గోలచేస్తావా?

రమ : ఏమిటా అహంకారము, సభ్యతలేకుండా.

గీత : యిప్పుడేం జరిగిందని?

రమ : [నవ్వారు హాస్యంగా] అవును, ఇప్పుడేంజరిగింది? ఐయాంసారీ గీతా! అనవసరంగా మూడొచ్చింది.

గీత ; నాటకాలగొడవలో - నా ఊపిరి తీస్తున్నావు బావా.

రమ : నన్ను నట్ట నాటకాలరాయుడు క్రిందే జమకట్టావన్నమాట. ఇన్సల్టు. గ్రేట్ ఇన్సల్టు మహానటుణ్ని పట్టుకుని - మరీ చులకనగా మాట్లాడితే కళామతల్లి క్షమించదు.

గీత : కళమా - కళాకారుల్ని అవమానించటం నా ఉద్దేశ్యం కాదు.

రమ ; మరేమిటి నువ్వనేది?

గీత . జీవితానికి కావలసిన కనీస వసతులు - కల్పించుకోకపోతే సంఘం మనల్ని గౌరవించదు బావా. అప్పుడు మానవతకు దూరమై పోతాడు మనిషి.

రమ : గీతా, ఏమిటి నువ్వు మాట్లాడేది?

గీత : బావా నువు వద్ద - కళాకారుల బతుకు బ్రతుకుల్ని గురించి.

రమ ; హం, బ్రతుకులు, అగ్ని అతుకులు. గతుకులు

గీత : చూడు బావా. జీవితాన్ని తెగిన గాలిపటం చేసుకుంటావా?

రమ : గాలిపటాలైతే ఏ గమ్యానికైనా చేరుకుంటాయ్ గీతా. కాని, కళాకారుల జీవితాలు, సముద్రంలో పొంగే తరంగాల వంటివి.

గీతా : ఇవన్నీ తెలిసి, ఈ అతుకులజీవితాన్ని ఎందుకు కోరుకుంటున్నావ్.

రమ, ఆ. క. లి యిది కళాకారుల తపస్సుకి, మేధస్సుకి, భగవంతుడు మిగిల్చిన ఆస్తిగీతా.

గీత ; బావా.

రమ : అవును గీతా. ఈ తరం కళాకారులజీవితాలు చరిత్రకందని కన్నీటి ప్రవాహాలు. ఆఫ్ కోర్స్ సమాజం మారలేదనీ. దరిద్రం తీరలేదనీ ఆశయాన్ని చంపుకుంటావా? లేదు, నేను చనిపోతే, నా సమాధి మీద ఓ పూలదండ వేస్తారు. సంతాపసభ చేస్తారు గీతా.

గీత : ఆ– అడగడమే మర్చిపోయాను. వెంకట్రావు పేరుమార్చుకున్నాడుగా?

రమ . పేరు మార్చుకోవటం – మనిషికో ప్రత్యేకమైన సరదా గీతా,

గీత , ఏదో నాటకాలు రాస్తున్నాడుగా.

రమ : వెధవనాటకాలు నేనూ రాస్తాను. ఏం చేయను.

గీత . ఇంతకీ "మహర్షి" గా మారిపోయాడన్నమాట?

రమ . మహర్షిగదాని మనసిచ్చేవు సుమా. మట్టిపాలుచేసి ఊరుకుంటాడు.

గీత . అడిగిన ప్రతివాడికీ ఇవ్వడానికి కాదు బావా– మనసుంది, నచ్చిన వాడికి అడగకుండా ఇవ్వడానికి.

రమ . సరి, నేను నీకు నచ్చినవాణ్ని కాదా గీతా.

గీత . నీకేం బావా, చాలా అందంగా వుంటావు?

రమ . అందాల పోటీపెడితే, నేనే మొదటివాణ్ని అవుతానని. మొన్న ఒకమ్మాయి చెప్పింది గీతా,

గీత . అందుకే బావా. నువ్వంటే.... నాకు చాలాయిష్టం.

రమ . నీకేమిటి గీతా. అందరికీ ఇష్టమే. ఎందుకంటే, నటుడ్ని కనుక. అసలు నేను బజారుకు బయలుదేరితే, అంతా చేతులెత్తేవాళ్ళే కొట్టడానికి కాదు. నమస్కారాలు పెట్టడానికి.

గీత . ఆ, వెంకట్రావు గూడ .... ఇలాగే చెబుతాడు.

రమ . రంగురంగుల మాటలుచెప్పి ... మనసుకు రంగుపూస్తాడు గీతా, జాగ్రత్త.

గీత . నేనంత తెలివితక్కువదాన్నేం కాదులే బావా.

రమ . తెలివి ఎక్కువయినా ప్రమాదమేలే– ఎందుకంటే, నాలాంటివాళ్ళ కాలు అడుకునేవాళ్ళను నమ్ముకుంటే- నాలుగురోజులు హాయిగా బ్రతకొచ్చు. కాని ... నాటకాలు రాసేవాణ్ని నమ్ముకుంటే -

పగలూ, [illegible], పరిచితల్లో కలిశాం. [illegible]
గుర్తురానుకో – వస్తా. (అంటూ బయటికి వెళ్ళిపోయారు. గీత లోపలికి వెళ్ళబోయింది. ఎదుటనుండి మదన్ సిగరెట్ తాగుతూ వచ్చాడు)

మ. గీతారాణీ!

గీత. (వెనక్కి తిరిగింది. అతనెవరో తెలీక మదుర మూసేసింది)

మ. ఏమిటి అలా చూస్తున్నావు?

గీత. మీరు ఎవరో గుర్తు లేక–

మ. (నవ్వాడు) నా పేరు.... మదన్.

గీత. మీకేమన్న మాట?

మద. నా జాతకం తెలిసిందన్న మాట?

గీత. కొందరి జీవితాలు – జాతకాలు చెప్పకుండానే తెలిసిపోతాయ్—

మద. అయితే ఇంకేం? నేనెందుకొచ్చానో చెప్పండి చూద్దాం.

గీత. మీరు చెబితేనే బాగుంటుంది.

మ. జీవితం నాకెప్పుడూ అలవాటులేదు గీతా.

గీత. మీరు చాల తమాషయినవారే–

మ. నా పనులు ఇంకా తమాషాగా వుంటయ్.

గీత. గారడీ చేస్తారా?

మ. గంగిద్దుల్ని ఆడిస్తాడు.

గీత. అర్థమైంది. ఇంతకీ మీరెందుకొచ్చారో?

మ. నీ కోసమే–

గీత. ఏమిటి మీరనేది?

మ. నన్ను మరీఅంత గౌరవంగా సంబోధించడం నాకు నచ్చదు గీతా. కట్ కటుగా మాట్లాడటం – చట్ పట్ గా పనిచేసుకోవడం. నాకు ఖలేజా.

గీత. నేనడిగింది.... మీరెందుకొచ్చారని?

మ. నేను ఎవరనుకున్నావు గీతా?

గీత. ఇప్పటిదాకా మనిషిననుకున్నాను.

మ . పారేస్తావు గీతా. అందరూ వదిలేవాళ్ళే.

గీత . తెలిసింది.

మ . ఆనందాలు పదిమందికి పంచిపెట్టేవాణ్ణి.

గీత . యింకేమీ చెప్పక్కరలేదు.

మ . నాకు తెలుసు గీతా. చాలామంది ఆడవాళ్ళు నన్ను అసహ్యించుకుంటారు కౌగిలిరుచి తెలిక స్వర్గానికే దారిచూపిన తర్వాత...వాళ్ళను వాళ్ళే మరిచిపోయి నా గుండెలమీద నిద్రపోతారు. చెరగనిముద్ర వేస్తారు.

గీత . చాలు... ఇకమీరేం మాట్లాడకండి.

మ . నీకు అసలువిషయం చెప్పనేలేదు కదూ?

గీత . దయచేసి వెళ్ళితేచాలు.

మ . మదన్ వచ్చినతర్వాత - పని పూర్తికాకుండా వెళ్ళడం చరిత్రలో లేదు గీతా!

గీత . అంటే... అంటే...? మీరు,

మ . అనవసరంగా ఎందుకు నన్నింత గౌరవంగా పిలుస్తావు? అందంగా మదన్ అంటేచాలు, అసహ్యంగా మాట్లాడితే చాలు. కసితో ద్వేషిస్తేచాలు. నోటికొచ్చినట్లు తిడితేచాలు. నన్ను నిజంగా ప్రేమిస్తున్నావని సంతోషంగా వెళ్ళిపోతాను.

గీత . ఓ మైగాడ్! ముందిక్కడనుండి వెళ్ళిపో.

మ . వెళ్ళకపోతే?

గీత . నాకు కోపంతెప్పించకు మదన్.

మ . కోపంలో యెరుపెక్కిన నీ బుగ్గలు చూడాలనివుంది గీతా.

గీత . ఛీ. యేమిటా మాటలు? మర్యాదగా బయటికివెళ్ళు- నేను తలుచుకుంటే - ఏమైనా చేయగలను.

మ . (నవ్వుతూ హేళనగా) మరి, నేను తలుచుకుంటే - నిన్నూ - నీ అందాన్ని - ఏం చేయగలనో - తెలుసాగీతా.

త . మదన్.

మ. చూడుగీతా. ఆకలితో యెదిగినవాళ్ళు, ఆవేశాలతో ఎదిగిన అత వాళ్ళు అందరికి ఈ మదన్ కౌగిలిలో ప్రగ్గిపోయారు.

గీత. వాళ్ళంతా నిస్సహాయులు, నిర్భాగ్యులు.

మ. కాదుగీతా. నీలాంటి అహంకారులు. యవ్వనం విగిసినవారు నిన్ను తలొంచారు యెందుకంటావ్?

గీత. నీలో మానవత్వం వచ్చిందని.

మ. కాదుగీతా, మమత, అనురాగం హెచ్చిందని.

గీత. మదన్.

మ. గీతా, బెట్టుచేయడం ఆడవాళ్ళకేం కొత్తగాదు. అప్పుడే మగవాడయిన ప్రతివాడికీ — ఓ పట్టుపట్టాలని ఉబలాటం పుడుతుంది. రా గీతా. జీవితాన్ని చీకటిచేసుకుంటే మనసు వేదన పడుతుంది. గుబులుగావున్న గుండెల్ని చిరునవ్వులో నికరించు, రా గీతా. (అంటూ మిదికెళ్ళాడు. ఆమె భయంగా దూరంగా వెళ్ళింది)

గీత. మదన్ వెళ్ళిపో నా బ్రతుకును కలుషితం చేయకు, నా భవిష్యత్తులో ముళ్ళుచల్లకు నీకు పుణ్యముంటుంది వెళ్ళు మదన్, వెళ్ళిపో.

మ. నేనేం పాపంచేశానని పుణ్యంకావాలి నాకు? పిచ్చి గీతా జీవితంలో అనుభవించలేనిదీ, కూడనిదీ ఏదీలేదు అందులో అందాలలో వున్న ఆడది. నవరసాలు నాట్యంలో ప్రదర్శించగలిగే నవనవలాడే ఆడది యెదురుగా వున్నప్పుడు - యెవరు తడుకున్నప్పుడు తిరిగి వెళ్ళడమే మహాపాపం.

గీత. మదన్

మ. యేం కావాలి నీకు?

గీత. ముందు నువ్వెళ్ళితే చాలు.

మ. ముద్దుగా నాకొక ముద్దుని అందించుమరి.

గీత, అది జన్మలో జరిగేపని కాదు.

మ. ఆ కోపం మరో జన్మకూడా యెత్తుతావా?

గీత. ముందిక్కడినుండి వెళ్తావా లేదా?

మ. వెళ్ళలేను గీతా. వెళ్ళిపోలేను. నా కళ్ళముందు. నగ్నంగా నాట్యం చేస్తున్నట్లు నువ్వు కన్పిస్తుంటే - ఎలా వెళ్ళగలను? ఎటు వెళ్ళగలను! అందుకే గీతా? నువ్వే రా! నా గుండెలదాకా రా! నా హృదయం చల్లారేదాకా రా! నా కోరిక తీరేదాకా రా! రా గీతా రా! (అంటూ చేతులుచాపుతూ ఆమెమీదకు వెడుతుంటే - ఆమె తప్పుకుంది.)

గీత. యేమిటీదౌర్జన్యం? ఇకిది న్యాయంకాదు. దయచేసివెళ్ళిపో మదన్.

మ. చూడు గీతా! వెళ్లూ వెళ్ళూ వెళ్ళూ అంటే నాకు చాలాకోపం వస్తుంది. అయినా నన్ను అవమానించడం నీ వుద్దేశ్యం అయితే నిన్ను బలవంతం చేయటం నా సిద్ధాంతం అవుతుంది,

గీత. మదన్.

మ. [illegible] మాటవినని నీలాంటి రంగురంగుబొమ్మల్ని ఎలాలొంగదీసుకోవాలో ఈ మదన్‌కు కొత్తేమీగాదు. రా.

గీత. [illegible] పో.

మ. ఒక్కసారేగా.

గీత. వీల్లేదు.

మ. గీతా!

గీత. వెళ్ళిపో.

మ. ఎంత అణకువగా చెప్పినా - అర్థం చేసుకోలేకపోతే - [illegible] తెలుసా? భవిష్యత్తులోకి సాగిపోయే నీ బ్రతుకు తీగను త్రెంచేస్తాను.

గీ. మదన్.

మ. నీ రాతను తుడిచివేస్తాను.

గీ. నోమ్యేయ్.

మ. నీ జాతకాన్ని మార్చేస్తాను.

గీ. మదన్, మదన్, నామీద నీకేమిటి పగ?

మ. పగకాదు గీతా! ప్రేమ, అభిమానం.

గీ. నీకు హృదయం లేదూ?

మ. ఉందిగనుకనే . మనిషిలా అడుగుతున్నాను. నాకున్న ఒక్కొక్కమన సులో .... ప్రేమ .. అనురాగం ... మమత మానవత నిండి ఉన్నాయిగనుకనే నవ్వింకా మాట్లాడగలుగుతున్నాను గీతా. నేను నవ్వనుకునేంత నీచత్వంకాదు. ఒక కన్నెని కౌగిలింతలో పులకించిపోవాలని అంటున్నాను, ఒక్క తీయ ముద్దుతో నన్ను ముగ్ధుణ్ణి చేయమంటున్నాను. ఎర్రవిబుగ్గల్ని ఒకే ఒకసారి నా పెదాలకు అందించమంటున్నాను. ఇవన్నీ తప్పులయితే నీ ఇష్టమొచ్చినంతసేపు నన్ను నీ చేతుల్లో బంధించు బిగించు, అంతా నీదే. నేను సిద్ధంగావున్నాను. కమాన్ గీతా. కమాన్. (చేతులు చాపాడు)

గీ. యూ ఫూల్ (కోపంతో పళ్ళుబిగించింది)

మ. గీతా పెదాలపై పూచే మధువులూ. సిగలో విరిసిన మల్లెలు-యవ్వన వరువాలు- ఉమ్మెం కలశాలూ - అన్నీ వృధా చేసుకుంటావా? వద్దుగీతా. నామీద నీకు ప్రేమ లేకపోయినా కసితోనయినా కౌగలించుకో కైపెక్కించి అయిదుచేసి కక్షతీర్చుకో రా గీతా. రా (అంటూ ఆమె వద్దంటున్నా వినిపించుకోకుండా కౌగలించుకు న్నాడు. గీత పెనుగులాడి చెంపమీద కొట్టింది. మదన్ చెంప చేతితో పట్టుకున్నాడు, యింతలో బయటనుండి సుధర్శి వచ్చాడు.

గిత గలాంచుకుని లోపికివెళ్ళింది. మదన్, మహర్షి ఒక వాకర చూసుకున్నారు.

మహ. దెబ్బ తగిలిందా?

మద లేదు. ఆమె వేసిన ముద్రలు చెరుపుకుంటున్నాను.

మహ జీవితమ్మీద ... కాలం ఎన్నో చెరగని ముద్రలు వేస్తుంది.

మద . వాటిని చెరపవలసింది నేమకాదు, ఈ సంఘం, ఈ మనుషులూ, ఈ సంస్కృతి.

మహ. సంఘంలో నువ్వూ ఒక మనిషివేగా?

మద . మనిషినే... కాని నన్ను మానవతకు దూరం చేసింది ఈ సంఘం.

మహ (నవ్వుతూ) నువ్వే దూరమైపోతున్నావు.

మద . దానికి కారణం తెలుసా?

మహా. నీ అంతరాత్మ నడిగిచూడు.

మద . అదీ చచ్చిపోయింది ఇప్పుడు, ఎప్పుడో, ఎప్పుడో చచ్చిపోయింది

నటీపద . నష్టమైపోయింది. అందుకే దారి మార్చుకున్నాను.

మహ. ముళ్ళదారుల్లో పడిస్తే — బ్రతుకునిండా గాయాలవుతాయి.

మద . గుండెపగిలి ముక్కలై పుండుగా మారినతర్వాత బ్రతుకుమీద గాయాలకు భయపడవలసిన అవసరం లేదు.

మహ. మనిషిలా జీవించడం నీ కిష్టంలేదన్నమాట?

మద . జీవితాన్ని కవిగా అనుభవించడం నాలాంటివాళ్ళకు చాలా అవసరం.

మహ. నీ అవసరాలకోసం యితరుల బ్రతుకులమీ నిప్పులు పోస్తావా?

మద వాటిని రక్షించుకోగా భావించేవాళ్ళు దొరికితే అదృష్టవంతులవుతారుగా.

మహా. యిది ఒక అదృష్టమే: నిముష నిముషానికీ తలొంచి ... మనిషి మనిషికి చేజాపి- చట్టానికి సంఘానికీ, భయపడుతూ- నరకాన్ని ప్రత్యక్షంగా అనుభవించటం కూడా - ఒక అదృష్టం దాన్నిమళ్ళా కరు పంచుకోవాలి,

మద . గీతను ప్రేమిస్తున్నావా?

మహా. ప్రేమించటం సరదాకాదు.

మద . యేమిటి నువ్వు మాట్లాడేది?

మహా. విషాదాన్ని, పిరికివాన్ని ఇతరుల బ్రతుకులమీద చల్లను అంటు నాను.

మద . మదన్‌కు యెదురుచెప్పేవాళ్ళు యింతవరకూ యెవ్వరూలేరు.

మహా. బ్రతుకుమీద ఆశ - భవిష్యత్ మీద తీపి నాకు లేదు.

మద . నువ్వు అబద్ధాలు నిజాలుగా మార్చేవాడివి,

మహా. యేమిటి నీ ఉద్దేశ్యం?

మద . నీ అంతరాత్మ నడిగిచూడు వస్తా. (వెళ్ళబోయాడు)

మహా. యింకెంతకాలం సాగిస్తావు ఈ అరాజకాలు,

మద , బ్రతుకు స్వర్గం అయ్యేదాకా.

మహా. స్వర్గాన్ని చేతులారా నువ్వే నరకం చేసుకుంటున్నావు?

మద. కాంతివిలువ తెలిపేదాకా చీకటి వుండాలిగా,

మహా చావు సిద్ధంగా వుందనే మనం బ్రతుకుతున్నామా?

మద , బ్రతుకులన్నీ యెప్పుడోసారి చావు తన్నుకుపోతుంది మహార్షీ! వస్తా. (వెళ్ళబోయాడు)

మహా . మళ్ళీనా?

మద , ఇప్పుడు నువ్వు రాకుండావుంటే మళ్ళీ నేను రావలసిన పని ఉండేదికాదు వస్తా [అంటూ చరచరా బయటికి వెళ్ళాడు గీతఏడుస్తు బయటికొచ్చింది.]

మహా. యేడుస్తున్నావా గీతా?

గీత . నాకు మిగిలింది ఏడుపేకావా [దుఃఖం ఆగలేదు]

మహా. కళామూర్తి కన్నీళ్ళు భూమాత భరించలేదు గీతా.

గీత . బావా!

మహా. తరతరాల పాపపంకిలంతో తడిసి - ముద్దయి పసిడిపంటలు పండే తెలుగుగడ్డ - విస్ఫారమై విశ్వేశ్వర్యమై మట్టిగానే కుంగిపోతుంది గీతా.

గీత నీ సానుభూతికి యెలా కృతజ్ఞతలు తెలుపను బావా ఎలా అభినందించను?

మహా. నాకో సహాయం చేస్తావా గీతా?

గీత . నీకూ మనసుకావాలా బావా?

మహా. ఇష్టంలేని మనసును అడిగి పుచ్చుకునేంత అవివేకిని కాదుతే గీతా.

గీత , ఏం చేయమంటావు బావా?

మహా. మెరిసే కనుపాపలమండి కురిసే కన్నీళ్ళకు - అర్థం చెప్పాలని వుంది.

గీత . నా బ్రతుకును బజారుపాలు చేస్తావా బావా!

మహా. గీతా.

గీత నీ అభ్యుదయ భావాలకూ - కవితావేగాలకూ సవోష్ణ కథావస్తువును చేసి - సాహిత్యంతో - చైతన్యంతో - పళ్ళంతా గాయాలు చేస్తావా, నేనేం తప్పుచేశాను బావా? ఆడదానిగా పుట్టిన నేరం కన్నా - యింకేం చేశాను?

మహా. రావణుడు గడ్డతోసహా పెకలించుకుని లంకకు మోసుకెళ్ళిన సీత కూడా అడదే గీతా.

గీత . అందుకే బావా. అవమానాలూ, అనుమానాలూ సహించలేక అగ్నిలో దూకింది,

మహా. నిండు కొలువులో వలువలు వూడదీస్తుంటే కురుజు విష్ణుకుని మానాభిమానాలు కాపాడుకున్న ద్రౌపదిగూడా ఆడదేగా.

గీత. ఐదుగురు భర్తలున్నా అడవుల పాలుగాక తప్పలేదుగా.

మహా. వయసు తరిగిపోతున్న కొలదీ వచ్చేది ముసలితనమే గీతా.

గీత. అయినా ఆడదానికి అగ్నిపరీక్షలు భగవంతుడు ఎందుకు పెట్టాడు బావా?

మహా. ఏ ప్రశ్నకు సమాధానం లేదు గీతా.

గీత. నా ప్రశ్నకిగూడా పరిష్కారం లేదు బావా?

మహా. ఉంది గీతా. అందుకే నేను కలంపట్టాను.

గీత. ఏపనీ లేనప్పుడు ఏదో ఒకటి చేయాలిగా.

మహా. నాకెంత పేరుందో నీకేం తెలుసు?

గీత: ప్రతి మనిషికి.... ఏదో ఒక పేరు ఉంటుంది బావా.

మహా: అయితే ... మనుషుల్ని చంపేవాడు - మానవతను పెంచేవాడు ఒకటేనంటావా?

గీత. మంచి చెడులమధ్య దూరం నాకుతెలుసు బావా.

మహా: తెలిస్తే... నువ్విలా మాట్లాడవు గీతా చంద్రమండలం వెళ్లేవాడికి తిరుపతికొండ మెట్లు ఎక్కేవాడికి — పెతేడాద్దలేదంటే - విన్నే మనాలో అర్థం గావటంలేదు.

గీత: నన్నింతవరకే జమ కడుతున్నావన్నమాట.

మహా: లేదుగీతా. నువ్వునటివి. మహానటివి. నీలో ప్రకాశించే కళా తేజం.... ప్రపంచపు అంచులదాకా ... ప్రసరించాలి.

గీత: స్వార్థానికి హద్దుండాలి బావా.

మహా: ఆకాశానికి అంతుందా గీతా?

గీత: బావా.

మహా: అవును గీతా, మనిషి బ్రతకాలంటే — స్వార్థం కావాలి. కూడబెట్టడానికి - కుబేరుడు కావడానికి స్వార్థం కావాలి. ప్రేమించడానికి—

పేరు గడించడానికి స్వార్థం కావాలి. అసలు భవిష్యత్తులో నయవిస్తున్న మనిషి ప్రతిఒకడుగూ స్వార్థపరుడే .. పడుతుంది. ఎంతోమంది జీవితాలు ఈ స్వార్థపు సోపానాలమీదే స్థిరపడ్డాయ్. చిగురించాయి కూడా.

గీత : గుండెల్ని బద్దలుచేసే .... స్వార్థానికి లొంగి - అంతరాత్మను మోసం చేసుకోలేను బావా. వస్తా! (వెళ్ళబోయింది)

మహ: ఆ.... గీతా అసలువిషయం చెప్పడమే మర్చిపోయాను మొన్న "కొంపలు తగలడాయ్" అనే గేయం రాశాను... విన్నావుగా!

గీత : "కొంపలారి పోతున్నయ్" అనికూడా చెప్పావుగా-

మహ: అవునవును... నిప్పు రాజుకున్న తర్వాత - చిచ్చుపోవడం — ఆరిపోవడం జరుగుతుందిగా- ఇవ్వాళ గుళ్ళో సాహితీసదస్సు వుంది. వస్తావుగదూ!

గీత : సారీ బావా! నేను అరదాన్ని.

మహ: నేను నాగరికతాలోకంలో ... ఏదే పై చేయి.

గీత : చేయిదాటిన తర్వాత ... మనం కావాలనుకున్నవి, కోరుకున్నవి! ఏమీ తిరిగిరావు బావా. నువ్వెళ్ళిరా-

మహ: చూడుగీతా. మొన్న గుళ్ళో ఉపన్యాసంచెబితే, చెవ్వుగూడదు గానీ ... ఎన్నిచప్పట్లు- ఎన్నిదండలు— అచ్చం మల్లెపూలతో గుచ్చినదండలు - తల మునిగిపోయిందంటే- నమ్ము—

గీత : ఇప్పుడు నాకు తలమునిగిపోయేంత పనుంది బావా. వెళ్ళిరా- (అంటూ లోపలికివెళ్ళింది. మహర్షి నిట్టూర్చి బయటికి వెళ్ళాడు. తెర జారింది)

# రెండవ రంగం

(అలంకరణ మొదటిరంగంమాదిరేవుంది, గీత విచారంగాకూర్చొని వుంది మధు గులాబి తీసుకుని బయటనుండి వచ్చాడు)

మధు : గీతా.

గీత : (చూసింది - విరాళవించిన ప్రేమతో)

మ : ఈ గులాబి ఎంత అందంగావుందో చూడుగీతా.

గీత : దేవుని పాదాలవద్దకు చేరినప్పుడు ఇంకా అందంగా వుంటుంది మధూ కాని.... గండు తుమ్మెదలు దాని విందుజీవితాన్ని కలుషితం చేయకముందే కాపాడటం మంచిది

మ : ఏమిటి గీతా? పరధ్యానంగా మాట్లాడుతున్నావు

గీత . రక్షణలేని పువ్వులాగా ... నా జీవితం ...

మ : అదేమిటిగీతా. మధు జీవించివుండగా నీకేమీ అన్యాయం జరగదు జన్మజన్మలకూ ... నువ్వు- నేను భార్యాభర్తలం గీతా.

గీత : మధూ!

మధు: చూడుగీతా. పరీక్షలు పూర్తికాగానే ఇంటికివెళ్ళి నాన్నను ఒప్పించి పెళ్ళిఏర్పాట్లు చేస్తాను అప్పటిదాకా.... నిన్ను నా గుండెల్లోదాచు కుంటాను.

గీత : మధూ.

మధు: నువ్వు నాకు తోడుగావుంటే - అన్నిసంపదలూ ఉన్నట్లే. నీ నవ్వుల పువ్వులు వికసిస్తేచాలు, నా హృదయం పరవశించి పోతుంది,

గీత : నిజంగా నేనంటే నీ కెందుకింత అభిమానం?

మధు: నీకు నిండయిన హృదయం వుందిగీతా. ఆ హృదయంనిండా నేను న్నాను. అందుకే - అందుకే గీతా నువ్వంటే నాకిష్టం. (అంటూ ఆమెబుగ్గ గిల్లాడు)

గీత : అబ్బ. ఏమిటి చిలిపిచేష్టలు-

మధు: అందమయిన ఆడపిల్ల - అందుబాటులో వుంటే- మగవాళ్ళు ఏం చేస్తారో మరి?

గీత హద్దులు దాటితే - పెద్దలు కోప్పడతారు. దయచేసి.... వెళ్ళండి.

మధు: మరి ... మన మామూలు...

గీత : మామూలా- అదేమిటి?

మధు: (ముద్దు అన్నట్లు తెలిపాడు)

గీత : అబ్బాయిగారికి ఎంతాశ (అతని బుగ్గమీద చిటికెవేసి వెళ్ళబో యింది- మధు.... ఆమెపైట లాగాడు) అబ్బ యెవరయినా చూస్తారు.

మధు: చూడనీ - తొందరగా వెళ్ళయినా చేస్తారు.

గీత : మరీ అకతాయివై పోతున్నావు.

మధు: నువ్వు అకురాయివై పోవటంలేదు?

గీత : ఛీ పో- మొండి (అంటు వెళ్ళబోయింది - మధు అడ్డగించాడు. ఇదరూ డ్యూయెట్ పాడుకున్నారు. పాటచివర విడిపోతారు. క్షణం నిశ్శబ్దం.. బయటనుండి మహర్షివచ్చాడు. ఓ మహాశిలి పోజులో నిలబడి ఆలోచిస్తున్నాడు. ఇంతలో రమణ వచ్చాడు.)

రమ : ఏమిట్రోయ్ కప్పి దిగ్గాలోచనలో వడ్డావు?

మహా : ఏం లేదురా. మద్రాస్ వెళదామని-

రమ : కూడు మహాస్తి. అక్కడ మాననకలు తప్పిపోయా ఎ చెప్పిన వాళ్ళంతా బ్రతుకుతున్నారు. శీలాన్ని ఎరచూపేవాళ్ళు. పిగ్గుని విరజిమ్మేవాళ్ళు- ఆత్మగౌరవాన్ని అమ్ముకునేవాళ్ళు - అమహా నగరంలో ఖరీదులేని వస్తువులు. అందుకే మహాస్తి. కళామతల్లి కుళ్ళికుళ్ళి ...ఏడుస్తూంది.

మహా : వ్యక్తిత్వం లేనివాళ్ళు- ఇక్కడావున్నారు రమణా

రమ : వాళ్ళగొడవ మనకెందుకులే-

మ : నీ గొడవేమిటో చెప్పు-

రమ : నేనోకథ చెవుతా. నాటిక రాసిపెడతావా?

మ : బ్రై చేదాం చెప్పు.

రమ : అయితే నన్ను పూర్తిగా మూడ్‌లోకెళ్ళిపోని- (అంటూ ఆలోచిస్తూ రెండడుగులు నడిచాడు) అ.... వచ్చినది మహాస్తి. మూడ్ వచ్చినది- ఇప్పుడు మా నటన ప్రశంసనీయం. నటులూ - మహా నటులూ అందరూ మనకు తల వంచవలసిందే అహా. మూడ్ వచ్చినదిగాని ఏదో మాటాడుచుంటిని- మహాస్తి. నేనో చిన్నకథ చెబుతాననిగదా చెప్పితిని.

మ : అవును మహాశయా చెప్పితిరి, చెప్పితిరి.

రమ : అది ఒక ఉద్యానవనము.

మ : ఆ వనమందొక మేడ. మేడపైన,

రమ : కాదు మహాస్తి. ఆ ఉద్యానవనమున కొంచెము విశ్రమించుదమని జని- అచ్చటి పూ పరిమళాలు తృప్తిగా నాఘ్రాణించి—

తిరిగి అంతఃపురమున కరుగుచుండగా – నడివీధిలో ఒక అద్భుతము కలిగినది మహర్షి.

మహా: (నవ్వాడు) ఒరేయ్ నాటకాలు ఆడేవాళ్ళను చూసి నవ్వక–నాగరికులైనవాళ్ళను చూసి నవ్వుతారా ఆడవాళ్ళు నీ పిచ్చిగాని.

రమ: ఊరంతే నవ్వుకొనిన నాకింత వేదన. ఆ వేదన యేల కలుగును ఆ సముజ్వలాంగి మమ్ములను చూసియే నవ్వింది.. వాడి వాడి అమ్ములను రువ్వినది మహర్షి.

మహా: చాలా అదృష్టవంతుడివి

రమ: ఏమో మహర్షీ తలచుకున్న కొలదీ– గుండెను తొలిచినట్లే అవుతున్నది ఏలనో మనసంతా. వ్రేరిగంగులెత్తుచున్నది. అవగలాడి వాలుచూపులు మదీయ హృదయ కుసుమాన్ని గాయము చేసినవి.

మహా: ఇంతకూ మందేమీ వేయలేదా?

రమ: కొంచెము ఊరట కలిగినపిమ్మట – వళ్ళంతా తడుముకుని– చూసుకుంటిని గదా – మా అవయవాలలో చిన్న లోపము కానవచ్చినది మహర్షి.

మహా: అదేమిట్రా?

రమ: అవును మహర్షి ఉన్నవి, ఉన్నచోట వున్నవిగాని గుండె మాత్రము.. మొదటి గురుతులో లేక – యెక్కడో వేగిపోవుచున్నట్లు అయినది. అందుకే.. మేము ఆ పూబోడిచెంతకు చేరితిమి ఆ సుకుమారి.. సగౌరవంగా తన మందిరానికి ఆహ్వానించినది కూడ.

మహా: ఆమె అందంగా ఉందన్నమాట?

ర : ఆహా, ఆ వయ్యారి అందము గురించి - ఒక ప్రబంధము వ్రాయ వచ్చు మహర్షీ.

మ : రంభ - ఊర్వశి - మేనక - తిలోత్తమలు....

ర : ఆమె కాలిగోటికి సరితూగరు మహర్షీ, అంతఃపుర కాంతలతో సరితూగవలసిన నెచ్చెలి, ఒక సామాన్యుని ఇంట తన సౌందర్యానికి ముసుగు వేసుకొనుట, ఎంత సిగ్గుచేటు. ఎంతశోచనీయం.

మ : ఇంతకూ ఏం చేశావో చెప్పరా.

ర : ఆ అందాలబాలను అక్కున చేర్చుకుని - ముచ్చట తీర్చుకోవాలని - ముచ్చటపడిపోయాను.

మ : ఒప్పుకుందా మరి.

ర : మహర్షీ, ఏల నీకీ తొందర? నీకూ మాకూ, వళ్ళు పులకరించి పోవుట లేదుగదా.

మ : లేదులేవోయ్ - త్వరగా ఆఘోరించు -

ర : సుందరీ. మమ్ములను చూసి - తలుపుచాటున వేచి - ఎందుకునివ్వెతివి? మా గుండెలను ఎందుకిలా లాగితివి? అవి, ముందుగా వేసితివి. ప్రశ్న.

మ : నిన్ను ప్రేమించానందా?

ర : ఆ లేతపెదవులనుండి, ఆ తీయనిమాట వస్తుందనే, ఆశ కాని, ఆ బేల కన్నీరు కార్చినది.

మ : ఎందుకురా?

ర : నేనూ ఆ ప్రశ్న వేసితిని ఆమె మరీమరీ, వెక్కి వెక్కి ఏడ్చినది. అప్పుడు మాకు ఆ జవరాలుమీద జాలి కలిగినది. దేవీ! ఏమిటా

కన్నీరు? ఎందుకిలా వెక్కి వెక్కి ఏడుస్తుంటివి? అని గుచ్చి గుచ్చి అడిగితిమి.

మ : ఏం చెప్పింది?

ర : హృదయం ఒకసారే ముక్కలయ్యే మాట చెప్పినది. యువరాజా, నేను అందరినీ చూసి వచ్చాను మా ఇంటి తలుపులు ఎప్పుడూ తెరిచే వుంటయ్. అని చెప్పినది.

మ : అప్పుడు గదా, మా చిత్తము చిత్రవధ అయినది; అసలు మేము విశ్రాంతికొరకు ఆ ఉద్యానవనమ్మునకు ఏల పోవలె? పోయితిమి పో - గృహోన్ముఖులమై - పట్టణ మధ్యంబున కేల నేగవలె? ఏగితిపో, ఒక వలపుకింత, ఏకాంతముగా మమ్ములను చూసిఏల నవ్వవలె?

మ : నవ్వెనుపో- ఆ సుకుమారి పుట్టుపూర్వోత్తరాలు గుర్తించకయే ఇంటిలోని కేల నరుగవలె?

ర : అరిగితిపో - ఆ వయ్యారి ఏల వెక్కి వెక్కి ఏడ్వవలె?

మ : ఏడ్చెనుపో-

ర : మేము యుక్తాయుక్త విచక్షణ విస్మరించి ఆమెను గుచ్చి గుచ్చి ఏల....

మ : [నవ్వాడు. రమణ శృతికలిపాడు]

ర : ఎలావుంది మనకథ?

మ : బాగుందిరా- చాలా బాగుంది- నా కలంలో బలం నాభావం లోతునం ఇప్పుడు చూపిస్తాను. తప్పకరాస్తాను.

ర : ఓ, ఐయాంసారీ మహర్షి వస్తా! [వెళ్ళబోయాడు]

మ : ఒరేయ్ రమణా!

ర : అన్నట్లు నీకేమి చెప్పలేదు గదరా?

మ : ఎందుకు చెప్పలేదు? ఉద్యానవనము-నడివీధి- వాలుచూపులు- వీధి వాకిలి- నవ్వులూ - పువ్వులూ- తర్వాత ఏడ్పులు—

ర : అవేం కాదురా, ఇవ్వాళ నాకు సన్మానం.

మ : యెవర్రా చేస్తుంది?

ర : ఎవరో చేస్తే నోరు మూసుకుని కూర్చుని చేయించుకో దానికి- నేను మామూలు నటుణ్ని కాదు మహర్షీ మహానటుణ్ని।

మ : నువ్వే ఏర్పాటు చేసుకున్నావన్నమాట.

ర : హైకూ- శాలువా- పూలదండలూ యిచ్చిమరీ చేయించుకుంటున్నాను అంతేకాదు — చప్పట్లు కొట్టడానికి కాఫీ ఇప్పించి - ఓ పాతిక మందిని రెడీచేశాను కూడ.

మ : [నవ్వాలని ప్రయత్నించాడు] ఒరేయ్ రమణా ఇప్పుడిప్పుడే నీలో మినిష్టరయ్యే సూచనలు కన్పడుతున్నాయి రా—

ర : ఒరేయ్ మహర్షి, మొన్న పరిషత్తులో గెల్చుకున్న రెండు వెండి కప్పులూ, షీల్డూ- మార్వాడీ షాపులో మర్యాదగా తాకట్టుపెట్టి- చేయించుకుంటున్నామరా వస్తా [అంటూ రెండడుగులు లోనికివేసి శాలువా భుజంమీదుగా కప్పుకుని వచ్చాడు] చూడు మహర్షీ, ఇప్పుడు నేనెలా వున్నాను?

మ : ఓ మహాకవిలా వున్నావు?

ర : కవులతో పోల్చకురా బాబూ. కాఫీనీళ్ళు కూడా దొరకవు.

మ : అదిసరే— ఇవ్వాళ మేము ఫోటో తీయించుకోబోతున్నాం- ఆ శాలువా— —

ర : కావాలా?

మ : కావాలని కాదు. మొన్న నాకు చేసిన సన్మాన సందర్భంగా- దీన్ని

కప్పారు. ఇవ్వాళ కోటో తియ్యకుండాం అని చెప్పారు.

ర : ఒరే మహర్షి ఓకే ...తీసుకో. [శాలువా తీశాడు] ఒరేయ్ హంగుల కోసం- అందం కోసం - నేనీ శాలువా కప్పుకోలేదురా - చొక్కా చిరుగులు- అతుకులు- బయటపడకుండా వుండాలని కప్పుకున్నాను. ఇంకో గంట ఆగితే ... బ్రహ్మాండమైన కాశ్మీరు శాలువా నా భుజాలమీద వుంటుందిరా- తీసుకో మహర్షి [మహర్షి మీదకు విసిరేశాడు]

మ : (శాలువా సర్దుకున్నాడు) రమణా.

ర : ఒరేయ్ సభలో పాల్గొనడానికి- సన్మానాలు చేయించుకోవడానికి- యీ బోడి శాలువాలు అక్కర్లేదురా, ప్రజాభిమానం, కళాప్రతిభ కావాలి మస్తా (రెండడుగులు వేశాడు బయటికి)

మ : కోపం వచ్చిందా రమణా.

ర : [నవ్వాడు] చూడు మహర్షి ఎన్నో ఏళ్ళుగా కాఫీలు తాగితాగి— కోపాన్ని కరిగించి- కరిగించి, క్షమాగుణంగా మార్చుకున్న మన లాంటి ఉత్తమ కళాకారుల కళ్ళల్లో, యింకా కోపాలూ, తాపాలూ యెక్కడున్నాయిరా.

మ : ఎందుకురా అలా బాధపడతావ్?

ర : మొదటిసారిగా నేను వేదికమీద నటించినప్పుడు నా ప్రతిభకు మెచ్చుకుని మ్రోగించిన చప్పట్లు విన్నప్పుడు నా కోపం చల్లారిపోయింది. ఒరేయ్ ఇప్పుడు కోపం వచ్చి, గుండెను పగులగొట్టుకుని- గట్టిగా ఏడ్చినా, వచ్చేదిమాత్రం కన్నీళ్ళు కాదు మహర్షి, మస్తా [వెళ్ళిపోయాడు- సత్యం బయటనుండి ఎదురయ్యాడు)

స : ఏమిటి కన్నీటి కబుర్లు?

మ : కళాప్రతిష్ఠకు- కన్నీళ్ళే ఖరీదు. అంటుంటే యింకా యీ కాలం క్షమిస్తుందేమిటి అంటున్నావు? (గిరి లోపలినుండి వచ్చింది)

గీత : ఎంతసేపయ్యిందన్నయ్యా వచ్చి?

వ : ఇప్పుడేనమ్మా

గీత : మరి... వెళ్ళిన పని ...

రమ : మామూలే గీత. మనం ఉద్యోగాలకోసం వెళ్ళినప్పుడు బయలు దేరితే నో వేకెన్సీ బోర్డు—మన కోసం వుంటాయ్ అంతే బావా?

వ : అవున్రా! సర్టిఫికెట్ చూపగా — సత్యంపేట వినగానే సరే — పోయిరా అంటున్నారు.

గీత : ఎందుకని?

వ : అంతేనమ్మా! సత్యం కేవలం సత్యాన్ని రక్షించడానికే పని కొస్తాడట—

మహ: అంతే బావా! వ్యాపార సంస్థల్లో సత్యం చచ్చిపోయిందిగా—

రమ : ఫ్యాక్టరీల్లో కూడా—సత్యం పలిగిపోయింది గీతా?

గీత : చైర్మనుగారు...ఏమన్నారన్నయ్యా?

వ : మొన్నటి మాటనిన్న—నిన్నటి మాట యీ రోజు— అంటూనే వుంటాడమ్మా! ఆయనకేం మహారాజు.

గీత : ఇకమనం ఎలా బ్రతకాలన్నయ్యా?

వ : బోలెడు దుఃఖం వుందిగా గీతా, తృప్తిగా తాగి కడుపు నింపు కుందాం, అసలు మన కళ్ళలో కన్నీళ్ళు వుండాలేగాని... యీ జన్మకు కరువేలేదు గీతా,

గీత : అవునన్నయ్యా.

వ : అవునమ్మా, అంతే .. అంతే.

మహ: కష్టపడి చదివి ... బియ్యేడిగ్రీ సంపాదించాడు బావ. ఇప్పుడు దాన్ని తాకట్టుపెట్టినా—కొనేవాడూ లేడు. పాపం అనేవాడూ లేడు.

రమ : సారా బట్టీలకూ— పాపిష్టులకూ— పరిరక్షణవుంది. గీతా. కాని....

చదువుకున్నవారు ప్రతికళానికే-కనీసం రావడానికి వెనుకాడా, ఇప్పు కోటి దిక్కుమాలిన చట్టం.

న : అందుకే-అందుకే.... ఎంతోమంది సౌభాగ్యాలు నిక్కష్టులూ-యీ కసాయి మూకల కాళ్ళక్రింద నలిగిపోతున్నారు ఎదళ్ళ ఇక్కాల్లో, పధుళ్ళ కుష్ఠిలో. మంచిని మానవతనూ-చిత్రవధ చేస్తున్నారు మానభంగాలూ-మారణ హోమంతో, యీ రామరాజ్యాన్ని రాక్షస రాజ్యంగా మారుస్తున్నారు.

మహా: ఉడిగించేసే వాళ్ళంటే-ఉపేక్ష చూపని అధికారులు, ఉపకరించే వాళ్ళంటే, ఉలిక్కిపడతారు.

న : అందుకే మహర్షి నాకు ఉద్యోగం అక్కర్లేదు.

గీత : అదేమిటన్నయ్యా?

న : అవునమ్మా, గుక్కెడు చైతన్యం తాగుతాను.

గీత : అన్నయ్యా!

న : బ్రాందీలా, విస్కీలా, తాగి, వదలి బాధ్యతలు విస్మరించి-ప్రజల్ని మర్చిపోయిన, పాలకుల కళ్ళు తెరిపిస్తాను. ఈ దేశ పురోభివృద్ధికో, మెట్టునై, భావితరాల పునాదినై, చైతన్య స్రవంతినై, అధికారమదమత్తులో మునిగిన పెత్తందార్ల నరనరాలో ప్రవహిస్తాను అ అహంకారుల అణువణువులో చేరి, అడుగడుగునా, అగాధం సృష్టిస్తాను.

గీత : అన్నయ్యా.

న : అదే నేను చేయవలసిన పని గీతా. నాకు మిగిలిన పనికూడా అదే, అస్తులు అమ్ముకుని, అహోరాత్రులు శ్రమించి, చదివి సంపాదించిన విద్యే తిర్గి, నన్ను చూసి, పదేపదే ఎగతాళిచేస్తుంటే, ఇంకా నేనెందుకు క్షమించాలి యీ పెద్దరికాన్ని? ఒరేయ్ రమణా. యీ కళలా, కవితలా? జీవితాన్ని ఉద్ధరించలేవురా.

భావితరాల బాటలు వేరిపే – పెత్తందార్లనుపట్టి అధికార భ్రష్టుల్ని చేయాలి. సమధర్మం–సమభావం–ఒగురింపజేయాలి.

తమ : విప్లవం కావాలంటావా బావా?

వి : ఏదేశంలోనైనా–విప్లవంతోనే సమత పుట్టిందిరా–

గీత : చూశావ్వయ్యా. ఈ విప్లవాలనీ–ఉద్యమాలనీ బ్రతుకుల్ని చీకటి చేసుకుంటారా?

వి : ఏమిటమ్మా నువ్వనేది?

గీత : దేనికైనా అర్హత కావాలి. జేబులు కొట్టాలన్నా జైలుకు వెళ్ళాలన్నా తగినవాళ్ళే కావాలి. మనం పేదవాళ్ళం మా జీవితాలు అరిటాకులు ముళ్ళ పొదల్లాంటి అధికారం మీద పడితే నష్టం మనకే–

వి : నిజమేగీతా! కాని.... ఈ బానిస బ్రతుకులు ఎంతకాలం ఈ ఆకలి బాధలు ఎన్నాళ్లు? అందుకే అమ్మా విప్లవం కావాలంటున్నాను–

మహా: ప్రజా విప్లవం కావాలి

తమ : చైతన్యం విప్లవం కావాలి.

వి : శ్రమజీవుల బ్రతుకులు బంగారుమయంచేసే ప్రజావిప్లవం కావాలమ్మా

మహా: గీతా దేశప్రగతికీ ప్రయోజనానికి రాచబాట విప్లవం అందుకే...

నా కలంలో చైతన్యం పోస్తాను–

తమ : నేను నా గుండెలో–విప్లవజ్వాల వెలిగిస్తాను.

వి : ఆ జ్వాలను.... దేదీప్యమానంచేసి ఆకాశానికి ఎగురవేయండి. బానిస బంధాలతో – తరతరాల చీకటిలో – వెలుగుకోసం–వెదికే ఈ పేద ప్రజల కన్నీళ్లు తుడవండి ఈ కసాయిపాలకుల కల్మషాన్ని అంతంచెయ్యడానికి–విప్లవఖడ్గం ధరించండి. గెలుపొందలా

అల్లుకుపోయిన స్వార్థపు బెడదల్ని తెగనరకండి. అప్పుడేగాంధి అప్పుడే విముక్తి అప్పుడే శ్రమకు తగిన ఫలితం:

రమ : ప్రజావిప్లవం –

మహ: వర్ధిల్లాలి.

వ : ప్రజావిప్లవం –

రమ:

మహ: వర్ధిల్లాలి

గీత : ముందు భోజనాలకు రండన్నయ్యా

వ : పదమ్మా

రమ : బావా మూడ్‌లో అసలువిషయం చెప్పడమే మర్చిపోయాను, ఇవ్వాలి నాకు సన్మానం మీరంతా రావాలి.

వ : అఘోరించావ్లే టొంచేసివెళ్లు. (లోనికి వెళ్ళాడు)

రమ : వద్దుబావా. అన్ని ఏర్పాటు అక్కడే చేశాను వస్తా (చర చరా బయటికి వెళ్ళాడు. మహర్షి గీత లోనికి వెళ్ళారు. తెల్లారింది)

# మూడవ రంగం

(అలంకరణ మొదటిరంగం మాదిరేవుంది. గీత జడ అల్లుకుంటూ కూర్చొంది. అప్పుడే బయటినుండి వచ్చిన మదన్ ఆమెను నిలువెల్లా చూస్తూ చెంప కోయ్యాలు ఆమె అతన్ని అసహ్యంగా చూసి ఒక మూలకు వెళ్ళింది)

గీత . మళ్ళీ ఎందుకొచ్చావు?

మ . చెప్పానుగా వస్తానని?

గీత . దయచేసి యిక వెళ్ళు

మ . ఇప్పుడేగా వచ్చింది?

గీత . చెప్పేదినీకే. మర్యాదగా వెళ్లు.

మ . (నవ్వుతు) వెళ్తాను. వచ్చినపని పూర్తికానీ.

గీత . నా మనసు పరాధీనమైంది. నేను మరొకరికి అంకితమైపోయాను. నా జీవితాన్ని పాడుచేయకు వెళ్ళు.

మ . చూడుగీతా. అందంగాపుట్టిన ప్రతి ఆడదీ మొదట యెగిరెగిరిపడుతుంది వెర్రెక్కిన తర్వాత నరసాలయిచి నురిగిన తర్వాత ఒది గొంగి వుంటుంది.

గీత . ముందు నువ్వు వెళ్తావా లేదా?

మ. నేను చెప్పేది పూర్తికానీ మరి.

గీత. ఇక నువ్వేం చెప్పక్కరలేదు.

మ. చెప్పకపోతే నీకు అర్థం కావటంలేదుగా.

గీత. మదన్.

మ. తప్పించుకోవాలని నన్నో తమ్ముడిలాగా అనుకున్నానని ప్రయత్నించకు కసికసిగా మాట్లాడి నన్ను కైపెక్కించకు గీతా.

గీత. ఛీ! నీకు బుద్ధిలేదూ?

మ. ఇప్పుడు తెలిసిందా నీకు?

గీత. అనవసరంగా మాట్లాడి బుద్ధి చెప్పించుకోకు

మ. నీలాంటి బుద్ధిమంతులు ఇంతత్యాగానికి పూనుకుంటే నేనేం చేయగలను? లేదీ శిక్షేమిటో చెప్పి కౌగిలిలో బంధించడమేనా?

గీత. కాదు — కటకటాలలో

మ. (నవ్వాడు) చూడు గీతా. నువ్వు ఆడదానివి.

గీత. ఆదిశక్తిని కూడా.

మ. అందమైనదానివి కూడా.

గీత. నీ పాపం పండేదాకా.

మ. వలపు పండే శుభసమయంలో ఇవేం మాటలు గీతా.

గీత. ఆడవాళ్ళంటే ఏమిటి నీకు అలుసా?

మ. "పువ్వులన్నీ పడతులకోసం - పడతులంతా పురుషులకోసం" అని ఓ కవి రాశాడు గీతా చదువుకోలా?

గీత. చదివాను. నీలాంటి దుర్మార్గులు త్వరలోనే నాశనం పొందుతారని కూడా చదివాను.

మ. గీతా, గీత రాముడు పుట్టినప్పుడే రావణుడు పుట్టాడు.

గీత: అందుకే సీత అగ్నిలో దూకింది.

మ. ధర్మరాజు పుట్టినప్పుడు కురురాజు పుట్టాడు.

గీత . అందుకే ద్రౌపది కురులు విరబోసుకుంది.

మ . పిచ్చిగీతా నువ్వెప్పుడు బాగుపడతావు?

గీ . మీలాటి నీచుల సమాధి కట్టిన తర్వాత

మ . గీతా నా మాట విను. అనవసరంగా ఎందుకు చెడిపోతావు?

గీత . ముందిక్కడనుండి వెళ్ళిపో-

మ . మాదు గీతా పుట్టినప్పుడే భయాన్ని వదిలేసిన మంచి మానవతలు దూరం చేసుకున్నాను. వ్యక్తిత్వం వచ్చినతర్వాత నీతి- నిజాయితీలను ప్రక్కకు నెట్టాను. అవిష్ణీపోగా నాకు మిగిలింది కసి పిమీత కాదు. ఈ సమాజమ్మీద ఈ సంస్కృతిమీద. ఈ మానవమృగాలు సృష్టించిన సాంప్రదాయాల మీద అందుకే అందుకే గీతా. నిన్ను మర్యాదగా అడుగుతున్నాను.

గీత . యింతసేపు నేనూ మర్యాదగానే చెప్పాను.

మ . గీతా గుండెల్లో సుడులుతిరిగే కసిని, కన్నులలో మెరిసే తరక్కళ శ్వాన్ని చూసి- యీ సంఘం యింతవరకూ నోరెత్తలేదు. యే చట్టం నన్ను బెదిరించలేదు.

గీత - అందుకే బరితెగించావ్.

మ , లేదుగీతా. చెడిపోయాను పూర్తిగా అగాధంలో పడిపోయాను. యిప్పుడు నాలో వ[illegible]షం లేదు ఓర్పు అంతకన్నా లేదు రా గీతా. క[illegible]వ్వించి - కవ్వించి నన్ను మరీ పశువునుచేయకు నవ్వుతూ రా మధువులు కురిసే ఆ లేతపెదవులు ఒకసారి నోటికందించు సిగ్గుతో ఎరుపెక్కిన గులాబీలాటి బుగ్గల్ని - ముద్దెట్టుకోనీ - ముగ్ధుణ్ణికానీ, నవ్వూ మురిపిం ఈ లోకాన్ని మర్చిపో హాయిగా నా ఎదిలో ఒదురపో రా గీతా. ఒక్కసారి (అంటూ చేయిపట్టుకుని మీదికి లాక్కున్నాడు. ఆమె విదిలించుకుని దూరంగా వెళ్ళింది)

గీత . ఎలా చెప్పను? ఏమని చెప్పను మధూ?

మ . అంటే —

గీత . నేను ఆడదాన్ని మధూ? యింతకాలం పెద్దలు సృష్టించిన హద్దులమీద నిలబడ్డాను. కాని, కాలం,

మ ఏం చేసింది?

గీత . మనిద్దరిమధ్య బిరిగిచింది.

మ , అది తెగించడానికే, మనకు పెళ్ళిజరగాలి గీతా.

గీత . మన పెళ్ళి, దేవుడు మనకిచ్చిన అదృష్టాన్నిటితో పెళ్ళి అపురూపమైంది, అపూర్వమైంది మధూ? కాని, కొందరికే ఆ అవకాశం కలిసివస్తుంది.

మ . అదేమిటిగీతా. మన పెళ్ళి జరగదనే అనుమానంగా వుందా?

గీత . జరగకుండా వుంటేనే మంచిది మధూ.

మ . గీతా.

గీత . నాకు అప్పుడే పెళ్ళిచేసుకోవాలని లేదు.

మ . గీతా ఏమిటి నువ్వనేది!!

గీత . సంసారబాధ్యతలు స్వీకరించాలని నాకులేదు మధూ.

మ . ఎందుకిలా మాట్లాడుతున్నావు గీతా.

గీత . మళ్ళీ మళ్ళీ నాచేత ఎందుకుచెప్పించాలని ప్రయత్నిస్తావు మధూ.

మ . మరి నన్నెందుకిలా చేశావు?

గీత . నేనెందుకిలా అయ్యానో – నీకేం తెలుసు?

మ . నన్ను ప్రేమించినట్లు నటించావన్నమాట?

గీత . నటించడానికి ప్రేమించవలసిన అవసరం లేదు మధూ.

మ . పెళ్ళి చేసుకుందామని – చేతిలో చేయి వేయలేదా నువ్వు?

గీత . ఎదలో ఎదనుకూడా కలిపాను.

మ . ప్రేమపేరుతో వలపు ఊయల వూగించలేదా నన్ను?

గీత : ఊహల్లో వూహించలేని ఐశ్వర్యమూ వూగిసలాడినవున్నా వింటే మధూ.

మ . మరి ఎందుకిలా మారిపోయావు?

గీత : ఇప్పుడు నేనేం చెప్పలేను మధూ.

మ : మనపెళ్ళికి మాత్రం అభ్యంతరం చెప్పకు గీతా.

గీత : అలా జరగడానికి వీల్లేదు మధూ.

మ . ప్రేమించినట్టు నమ్మించి- నటించి - నన్నెందుకు నవ్వులపాలు చేశావు. నేనేం పాపం చేశాను?

గీత . మధూ మధూ.

మ : చెప్పు గీతా. నా గుండెల్ని అగ్నిగుండాలుగా మార్చాలని ఎందుకు ప్రయత్నిస్తున్నావు? నన్ను కావాలనుకునే దానివైతే ఈ ఒక్క విషయం చెప్పు గీతా.

గీత . ఏమీ చెప్పలేని నిస్సహాయస్థితిలో వున్నాను మధు. నన్నేమీ, అడక్కు - దయచేసి వెళ్ళిపో.

మ : గీతా!

గీత వెళ్ళు మధూ. నామీద ఏమాత్రం గౌరవమున్నా. వెంటనే వెళ్ళిపో

మ . అలాగే గీతా కాని ... ఒక్కటిమాత్రం చెప్పివెళ్తాను.

గీత . ఏమిటి?

మ . నిన్ను మొదటిసారిగా చూసినప్పుడు నా హృదయాన్ని కోటగా కట్టు కున్నాను కాదు గీతా పగలగొట్టుకున్నాను, ఆశల చిగుళ్ళను చేతులా నరికివేస్తున్నావు.

గీత . మధు.

మ . చూడు గీతా, ఎప్పుడొచ్చినా - నవ్వుతూ నవ్విస్తూ నన్ను నీలో ఆహ్వానించేదానివి "నన్ను స్వర్గానికి తీసుకువెళ్ళు గీతా" అనగానే మధురంగా పాడేదానివి, ఆ పాటతోనే లోకాన్ని జీవితాన్ని

ఇంతకాలం మర్చిపోయాను మురళీను ముగ్గురన్నయ్యాను కాని, గీతా విధి ఎదురుదెబ్బ తీసిందని నా యెదను గాయంచేశావు,

గీత. నా గుండెలలో రగులుతున్న అగ్నిగురించి నేనెవరికి చెప్పుకోను మధూ ఎలా చెప్పుకోను.

మ. పోనీ .... ఒకపాట అయినా పాడగలవా?

గీత. జీవితం విషాదం అయిందని ఎలాపాడను మధూ.

మ. నేను వెళ్ళతాననైనా నువ్వుపాడాలిగా గీతా.

గీత. మధూ!

మ. నీతో స్నేహంచేసిన నేరానికి ఆఖరిసారిగా ఒక్కపాట అయినా వినిపించలేవా గీతా?

గీత; పాడతాను మధు నీ కోసం ఆఖరిగీతం పాడతాను. (అంటూ విషాదంగా పాడుతుంటూ ఓ ప్రక్కకువెళ్ళింది మధు చప్పట్లుకొట్టబోయి ఆగాడు)

మ. క్షమించుగీతా. జీవంలేని నవ్వులూ తాళంలేనిచప్పట్లు నిన్ను బాధపడితే క్షమించు నేస్తం. (వెళ్ళబోయాడు)

గీత: మధూ

మ; ఇంకేం కావాలిగీతా?

గీత. చిన్న సహాయం చేయగలవా?

మ. (పెదాలమీద నవ్వుతు విరాళగా) అదేమిటిగీతా. అడగకపోయినా మనసిచ్చాను నీకు ఇష్టంగా ముచ్చటగా వున్నంతసేపు/దాన్ని నీ వద్దనే వుంచుకుని విసిగేసి వినరి వీధిలోపడేసినా విరిచిముక్కలు చేసినా నిన్ను యేమన్నాను? చెప్పుగీతా ఏం కావాలి!

గీత, నన్ను నీచంగా చిత్రించకు మధూ.

మ. విచిత్రంగా ఆడుకుంటున్న ఆ భగవంతుడ్ని ఎలా ప్రశ్నించాలో అర్థంగాని నాకు నిన్నెలా చిత్రించమంటావు గీతా?

గీత. మధూ.

మ . వస్తాగితా. నీ మనసు తేలికపడినప్పుడు - గుండెలు భారమైనప్పుడున్నప్పుడు - మమ్మల్ని గుర్తుచేసుకో. అప్పటిదాకా నీ కోసమే ఎదురుచూస్తూ వుంటాను. (వెళ్ళిపోయాడు)

గీత : మహా [అంటూ సత్యంఫోటో దగ్గరకు వెళ్ళింది ఏడుస్తూ] అన్నయ్యా నన్ను కళామూర్తిని చేసిన ఆదర్శమూర్తి వెళ్ళిపోయాడన్నయ్యా. చీకటి కడుపున అంటివిజ్యోతి వెలిగించాలని తపించి- తపించి నా జీవితంలో వెలిగిన మహత్తర కళాతేజం ఒక్క నిముషంలో ఆరిపోయిందన్నయ్యా. ఆరిపోయింది! ఏడుస్తూ లోపికి వెళ్ళిపోయింది - బయటనుండి రమణ మహర్షి వచ్చారు]

మహ. మళ్ళి ఏడుస్తున్నావా గితా?
గీత : లేదుబావా నేనెందుకేడుస్తాను?

మ . చూడుగితా. సత్యం వెలిగించిన సమిధలం మేము. ఈ చిన్నినమిధలు సమరజ్వాలలై స్వార్థపరుల హృదయంలో చిక్కటి రాళ్ళుగా మారిన గుండెల్ని కాల్చివేసి మహోజ్వల జ్వాలలుగా మారడానికి నీ కన్నీరు చమురుగా పోశారు. త్యాగాన్ని సహనాన్ని పోసి నవసమాజ నిర్మాణానికి నిమైక్యతా పునాదులు కట్టడానికి మా యిద్దర్ని వెలిగించు గితా.

గీత . నేనే చీకటిగా మిగిలిపోయాను బావా.
ర . చీకటిని చీల్చడానికి స్వార్థాన్ని కూల్చడానికి మేమున్నాంగితా, సత్యం జీవించాలి

గీత . అంటే.... అన్నయ్య కేమైనా....
మ . విప్లవజ్వాల ఆరడానికి వీల్లేదుగితా.
గీత . అంటే....

ర . మహోగ్రరూపం దాల్చిన మానవతాజ్వాల యీ దేశ రక్షణానికి ప్రాణమున్న స్వార్థాన్ని మసిచేయాలి. చట్టాన్ని - శాసనాన్ని

పెద్దరికం పేరుతో పెత్తపు దారులతో బిగించిన అధికారుల అంతరాంతరాల్లో చేరి- చైతన్యం వెలిగించాలి, అనంత త్యా తరాల్లో ప్రచండజ్వాలగా ప్రజ్వరిల్లాలి.

గీత. ఏమాటలు నా కర్థంగావడం లేదు బావా?

మ. మనసత్యం అనంత విప్లవయజ్ఞానికి మహోగ్రరూపం ధరించాడు.

గీత. అధికారం కళ్ళుతెరిస్తే-

ర. అవును గీతా. అధికారం కళ్ళుతెరిస్తే.... సరియైన ప్రశ్న. మహర్షి నేను వెడుతున్నాను. [రెండడుగులు వేసి)

మ. ఒరేయ్. ఎక్కడికి?

రమ. మూడ్‌లోకి వెళ్ళి సమాధానం వెదుకుతాను (ఆలోచించాడు) ఆ... వచ్చినది మహర్షి గీత వేసిన ప్రశ్నకు సరియైన సమాధానం వచ్చినది. ఈ దేశంలో అధికారం కళ్ళుమూసి - యెన్నో ఏళ్ళు గతించినవి.

మ. అందుకే రమణా! ఎన్నో ఏండ్లు గతించినవి- కాని శత్రువానసలిన్. కనుల్ మోడ్చిన మందభాగ్యుండు ఒక్కండును తిరిగి లేచి రాడిక అన్నాడు విశ్వకవి జాషువా!

రమ. శాశ్వతంగా కనులుమూసినవారిని ఉద్దేశించి అన్నమాటలివి. కాని- వీళ్ళు? పెత్తందారులు.... నాయకత్వాన్ని గుప్పెట్లో బిగించి అందలాలమీద దొర్లుతున్న అధికార దురంధరులు. పదవులు పట్టుకొని తరతరాలుగా వ్రేలాడుతున్న మహా మంత్రగాళ్ళు గాఢనిద్రలో మునిగిపోయారు, వీళ్ళను లేపడానికి, ఎన్ని వేలకంఠాలు దిక్కులు పిక్కటిలేలా అరిచినా- లేపనే లేవరు.

మహ. గీతా వాళ్ళను లేపడానికి ఒక్కటే ఆయుధం,

రమ. అది విప్లవజ్వాల, ఆ జ్వాలను చైతన్యంతో రగిలించి, గుండెల లోతులలో అంటుకుపోయేలా మంటవేస్తేనేగాని ... కనీసన్యాయం జరగదు గీతా,

గీత. మీకోసం గాలింపచేసేదెవరో కూడా తెలుసా బావా:

రమ. ఎర్రటోపీలూ, బుర్రమీసాలూ, తుపాకులూ, మామూలే.

గీత. మీకిచ్చే బహుమానం కూడా తెలుసు?—

మహా. తెలిసేం: సంకెళ్ళు. జైళ్ళు.

గీత. యిన్ని తెలిసి యెందుకిలా చేయాలనుకున్నారు

రమ. అవమానము క్షమించరాని మహాపాతకము. పుట్టింటి సమాజము సహోదరిపై చేతన్యప్రసవంతిపై పరిపాటి మాలో ప్రవర్తింప జేయాలని ప్రయత్నం చేస్తున్న ఆ అసహాయత సహించరానిది గీతా.

గీత. బావా.

మహా. అప్పుడు గీతా, మన భవిష్యత్తును బంగారం చేసుకోవటం.... మన వంతు కర్తవ్యంకాదా చెప్పు.

గీత. విప్పను ముట్టుకుంటే ఏదేమో కాబట్టుంది బావా. (యింతలో బయటనుంచి సత్యం వచ్చాడు)

స. ఏమిట్రా మీటింగ్?

రమ. అబ్బే ఏంలేదు బావా. చచ్చినవాళ్ళను లేపడానికి మందులున్నాయేమోగాని, ఈ బతికిచచ్చినవాళ్ళను మేల్కొలపడానికి ఎన్ని గొంతులు కావాలి అంటున్నాను అంతే.

స. ఏమ్మా గీతా. ఏమిటలా వున్నావు?

గీత. ఏం లేదన్నయ్యా? బానేవున్నాను.

స. నాకు తెలుసమ్మా? మృత్యువును వెదుక్కుంటూ వెళుతున్న వీరి భవిష్యత్తునుగురించి నువ్వెంత కృంగిపోతున్నావో నాకుతెలుసు.

గీత. అన్నయ్యా.

స. అవునమ్మా. యికనేను మీతోకలిసి, ఆనందాన్ని పంచుకునే అవకాశంలేదమ్మా.

గీత. ఏమిటన్నయ్యా నువ్వనేది?

ర . ఏం జరిగింది బావా?

మ . ఏవరికైనా వెదకుతున్నారా బావా?

వ . చట్టమే వెదకుతుంది మహర్షి?

గీత. అన్నయ్యా?

వ . అవునమ్మా? చట్టానికి లొంగిపోయి కర్తవ్యానికి ద్రోహం చేయలేను.

రమ: మరేంచేస్తావ్ బావా,

వ . మీ అందరికీ కొన్నాళ్ళు దూరంగా వెళ్ళిపోతాను.

గీత . అన్నయ్యా

వ , నేను పారిపోవడంలేదమ్మా? యిన్నాళ్ళు నన్ను నమ్ముకున్న మిత్రులని కాపాడటానికి, నేను నమ్ముకున్న సిద్ధాంతాన్ని రక్షించడానికి వెళ్ళకతప్పదు.

గీత . సమసమాజ స్థాపనకోసం -అర్పణచేసిన ప్రతిఅణువూ శరీరంలో ప్రవహించే ప్రతినెత్తురుబొట్టుకూ ఫలితం యిదా అన్నయ్యా,

వ . గీతా.

రమ, యుగయుగాల దోపిడిలో మిగిలిన తరతరాల చీకటిని చీల్చడానికి చేపట్టిన విప్లవజ్వాల అడవుల్లో వెలిగిస్తావా బావా?

వ . లేదు రమణా, ఈజ్వాల ఆరేదికాదు- యిది మనం వెలిగిస్తే వెలిగేదికాదు. అందరూకలిసి- చైతన్యంపోసి వెలిగించే మహోజ్వలజ్వాల - ఎన్నటికీ ఏడారులపాలు కాకూడదు. అసలు ప్రతి మనిషికోసమూ ఒకజ్వాల రగలాలి. ప్రతి గుండె అగ్నిగుండంగా మారాలి. ప్రతిచేయీ ఆకాశాన్నంటే ఎర్రకాగడా కావాలి. అంతే రమణా, అంతే:

గీత , అయితే ... నేను... నేను ...

మహా. మేమున్నాం గీతా. ఏ భవిష్యత్తును తీర్చిదిద్దడానికి ప్రాణాలైనా అర్పిస్తాం.

వ . చూడమ్మా నాలాంటి అన్నయ్యలు యింకెంతమంది తల్లుల్ని—

పిల్లలీ - దెబ్బలను వదిలేసి - సమరజ్వాలలై పోతున్నారో — నీకు తెలీదు గితా.

గిత, అన్నయ్యా.

వ, అవునమ్మా సత్యానికి భాగస్తులై పవాళ్ళంతా చట్టానికి నేరస్తులుగా కనిపిస్తారు త్యాగానికి వారసులయిన వాళ్ళంతా - స్వార్థానికి బలి కాక తప్పదు. రమణా, మహర్షి నీకు బావలేకాదు. యికనుండి విలువైన అన్నయ్యలు కూడ. పితృం బ్రతికినంతకాలం సంస్కృతిలో ఏ లోపంరాదు గితా.

గిత. అయ్యో భగవాన్ [అనగానే బాయట విప్లవనినాదాలు వినిపించాయి రమణ, మహర్షి వాకిలిదాకా వెళ్ళి చూసివచ్చారు]

వ. కర్తవ్యం పిలుస్తోంది గితా, వస్తా [వెళ్ళబోతాడు]

గిత. అన్నయ్యా.

రమ. బావా సమాజానికా సావికి పూనుకున్న కర్తవ్యంకన్నా గిత భవిష్యత్తు బాగుచేయడం మా లక్ష్యం. నిశ్చింతగా వుండుబావా.

వ. వస్తానమ్మా [వెళ్ళబోయాడు]

గిత. అన్నయ్యా అన్నయ్యా....

వ. కర్తవ్యాని కట్టవేయడానికి కన్నీళ్ళు చాలవమ్మా. అభ్యుదయానికి బంగారు నిర్మించడానికి మనమంతా పునాదులు వేయాలి. లేకపోతే ఈ దేశం బాగుండదు గితా. అందుకే నేను వెళ్ళాలి వస్తా [అంటూ గబగబా బయటకి వెళ్ళిపోయాడు]

గిత. అన్నయ్యా [నావురుమంది]

రమ. యిప్పుడు ఏడ్వటానికి సమయంకాదు గితా.

గిత నాకు మిగిలి దే ఏడుపుబావా.

మహ. ఎడుపు కొందరికి ఆ వాళ్ళకు ప్రత్యేకంగా భగవంతుడు ప్రసాదిస్తాడు గితా అందుకే నీ చీకటిజీవితాన్ని వెలిగిస్తాం.

గిత. నాకు అదృష్టం లేదుబావా.

మహా. అదేమిటి గితా.

గిత. నేను అందరిలా పుట్టలేదు అగ్నిపరీక్షల్లో పుట్టాను చిన్నప్పుడే తల్లిని పోగొట్టుకున్నాను. బట్టకట్టడం నేర్చినతర్వాత - తండ్రిని దూరం చేసుకున్నాను. కంటికిరెప్పలా కాపాడిన అన్నయ్య .... యిప్పుడు వెళ్ళిపోతాడు యింక నేనెవరికోసం బ్రతకాలి? ఎందుకు బ్రతకాలి?

రమ. చూడుగితా, చావుకూడా అందరికీ అనుకున్నప్పుడూ కోరుకున్నప్పుడూ రాదమ్మా. మధు యెక్కడున్నాడో చెప్పు - అతనితో మాట్లాడి పెళ్ళి జరిపిస్తాం.

గిత, ఈ పెళ్ళి జరగదు బావా

రమ. గితా.

గిత. జరగడానికి వీలులేదు.

మహా. యెందుకని గితా?

గితా: కారణం చెప్పడానికూడా నోరు కట్టుబడిపోయింది బావా నన్నేమీ అడగొద్దు.

రమ: గితా నీకు మేము పరాయివాళ్ళం కాదు,

మహా: నీ కోసం ఏంచేయడానికైనా సిద్ధంగా వున్నాం గితా, కట్నాలూ కానుకలూ కావలసివస్తే...నా భాగం ఆస్తివుంది. అమ్మి .. లక్షణంగా పెళ్ళి జరిపిస్తాం గితా.

గిత; వద్దు బావా. మీరంతా త్యాగానికి పూనుకుని ఆత్మీయత మంచి తనంతో కట్టిపడెయ్యవద్దు. మీకు దణ్ణం పెడతాను దయచేసి నన్నేమీ అడక్కండి బావా! అంటూ లోనికి వెళ్ళింది ఏడుస్తూ)

రమ: మ ర్తి గిత ఏడుస్తుంది మదు మోనం చేయలేముకదా.

మహా: ప్రేమికులు పడిపోయారంటే అంతటిని మరొకటి వుండదు. అనలా ప్రేమనుండి విడిపోవాలంటే పెద్ద భూకంపం రావాలి.

రమ: మరి గిత ఎందుకిలా మారింది?

మహా: పద తెలుసుకుందాం. (లోనికి వెళ్ళారు. తెరపడింది)

